ఓం

శ్రీహయాననాయ నమః

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః



# శ్రీ నీతి సీతారామశతకము

ఇయ్యది

ప్రాథమిక విద్యాభ్యాసకుల కత్యంతోపయుక్తముగ వ్రాయఁబడి

బాలకవి

బ్రహ్మశ్రీ చింతపల్లి రామకృష్ణశాస్త్రిగారిచే

పరిష్కరింపఁబడి

బెజవాడ

ఆంధ్రగ్రంథాలయముద్రాక్షరశాలయందు

శ్రీయుత కుందా లక్ష్మీనరసయ్యగారిచే

ముద్రింపఁబడినది.

1938.



రచయిత:

సీతారామశాస్త్రి

[వెల 0—2—0]

# మనవి.

అయ్యా!

నేనీ పొత్తమును చిన్నతనమున విద్యాభ్యాసదశలో వ్రాసియుంటిని. ఇందనేక దోసఁగులుండవచ్చును. కాని పాఠకులు "దుష్టోయథాదోష ముపైతితద్వద్గుణీతుగృహ్ణాతితథా గుణాన్సదా" అను వచనదూరులు కాక గుణసంగ్రాహకులని నా నమ్మకము. కాన దోసగులు పొసఁగినఁగసరకుఁడు.

తే॥ బాల్యమందున కవన చా♦పల్యమునను
తప్పులొప్పులు నాక నీ♦చొప్పుగాను
పొత్తమొనరించితిని నేను♦బత్తితోడఁ
దప్పులున్నను దిద్దుఁడో! ♦ ధన్యులార!

## ఉపోద్ఘాతము

మా స్వగ్రామమందు విరాజిల్లు శ్రీ సీతారాములకీ పొత్తమంకిత మీబడినది. అదియు గ్రంథాదియందు మాపితామహుఁడు నాకు స్వప్నదర్శనమిచ్చి ప్రతిపద్యమునకు మకుటముగూడ "సీతారామా" అని యుండవలెనని విషమముగా నియమించుటచేఁ గొన్ని యతిప్రాసలకై మార్పులొనర్చితిని. గ్రహించి క్షమింతురుగాత.

నేనీ గ్రంథము చాలా కాలముక్రిందట వ్రాసినను ఈ నాటికి ముద్రణాలయాధికారియగు శ్రీకుందా లక్ష్మీన్ర నరసయ్యగారు, మా పెదతండ్రి కుమారుఁడగు శ్రీ ధూళిపాళ వేంకటేశ్వర్లున్ను ప్రోత్సహించి సాయమొనర్చుటచే ముద్రింపించఁబడియె.

అట్టి సహాయులగువీరికి భగవంతుఁడాయురారోగ్యైశ్వర్యములనిచ్చి రక్షించుఁగాతమని వేఁడుచు విరమించుచున్నాను.

ప్రకాశ

ఓం

శ్రీహయముఖాయ నమః

# నీతి సీతారామశతకము



కం॥ దంతమొకఁడు కలవానిని
దంతీశ్వరు మేల్మిమోముఁ ♦ దనరెడువానిన్
జింతలుదీర్చెడువాని న
తింతున్నిర్విఘ్నతకుఁ బ్రదీపితభక్తిన్॥

తే॥ మాననీయు జ్ఞానానంద ♦ మయుని దేవు
నిర్మలస్ఫటికాకృతి ♦ నెగడువాని
అఖిలవిద్యల కాధార ♦ మైనవాని
శ్రీ హయగ్రీవు నే నుపా♦సింతు మదిని॥

ఉ॥ చే నను వీణెమీటి తన♦చిత్తమునందు ముదంబునొందుచు
న్మానితభాగ్యరేఖక ల♦మానుషరీతినిబోధఁజేయఁ దా
పూనిమఱొక్కహస్తమునఁ♦బొత్తమునివ్వటిలంగమించనా
చాన సరస్వతీచరణ ♦ చారుసరోజము లాత్మఁగొల్చెదన్॥

కం॥ ప్రీతిగ నీ శతకంబును
నీతిని నంబాపురీశు ♦ నిఖిలార్థదు మా
సీతారాముల పదముల
కీతఱి నంకితమొనర్చి ♦ తింపుదలిర్పన్॥

కం॥ భూతలజనములు పొగడఁగ
నీతినిఁ దాబోధఁ జేయు ♦ నియమముతోడన్
'సీతారామా' యనుచును
జేతును నే శతక మొకటి ♦ సీతారామా॥ ౧

కం॥ విద్యకుఁ బసయగు వినయము
పద్యమునకుఁ బ్రాసయతియు ♦ బాపలకెల్లన్
హృద్యము సూపము విశ్వవి
జిద్యాగము పస నృపునకు ♦ సీతారామా॥ ౨

కం॥ మరుభూమిఁగురియువర్షము
వరసతి విధవయగు దాని ♦ పయసునుఁ గానన్
బరగెడి పున్నమవెన్నెల
సిరిగలిగినలోభిపగిది ♦ సీతారామా॥ ౩

కం॥ వెలపడఁతితోడిసంగతి
యిలలోపల వెఱ్ఱియొద్ద ♦ కేగుటయొండెన్
ఖలుతోడి స్నేహభావము
చెలఁగియెపుడు చేయరాదు ♦ సీతారామా॥ ౪

కం॥ బడుగునకు సాయమమరినఁ
గడువిద్యను శూద్రజాతి ♦ గాంచినయేనిన్
నడుమంత్రపుసిరిగల్గినఁ
జెడిపోవరెఁ బుడమిలోన ♦ సీతారామా॥ ౫

క॥ చెవిటికి శంఖముఁ బట్టుట
నవని న్మిడిమేలపుంబ్రి ♦ జాధిపుఁగొలువన్
గవితను మూర్ఖికిఁ దెలుపుట
శివ ! శివ ! వ్యర్థంబుగాదె ♦ సీతారామా ! ౬

క॥ వానలుకురియుట యొండెను
ప్రాణంబులు వోవుటొండె ♦ భాగ్యోదయముల్
మానినుల చిత్తమొండెను
శ్రీనాథున కెఱుఁగరాదు ♦ సీతారామా ! ౭

క॥ నీటుచెలి ముసలికొదవినఁ
గాటొక్కటి పామువలనఁ ♦ గలిగినయేనిన్
మీటఁదగు శస్త్రముండిన
చేటునకే యగునుగాదె ♦ సీతారామా ! ౮

క॥ బాకాలులేని పెండిలి
భూకాంతుఁడులేని పుడమి ♦ పున్నమచంద్రున్
దాకూడనట్టి నిశయును
జేకూరిన శోభలేదు ♦ సీతారామా ! ౯

క॥ చెవిలోని పోటుబాధయు
భువిలో దారిద్ర్యబాధ ♦ భూపతికొలువున్
నవకోమలాంగి విరహము
శివ ! శివ ! యరికైన వలదు ♦ సీతారామా ౧౦

క॥ ఉఱిమెడి మేఘంబొండెను
మొఱిగెడి శునకంబొకండు ♦ ముచ్చటలంతుర్
మెఱుఁగులుదీరిన మనుజుఁడు
సిరిలేని వదాన్యుఁబోలు ♦ సీతారామా! ౧౧

క॥ బంధువుల నర్థమడుగుట
సంధానము సతులతోడ ♦ జరుపుటయొండేన్
బంధురవిపినముఁ దిరుగుట
సింధురకరమూపుపగిది ♦ సీతారామా! ౧౨

క॥ షండునకు రంభదొరకిన
మెండగు గళకుచయుగంబు ♦ మేక కొదవినన్
ముండయగు కూఁతురుండినఁ
జెండాడెడి పందపగిది ♦ సీతారామా! ౧౩

క॥ సద్ధర్మ మొరులుజెప్పిన
నిద్ధర విహితంబులైన ♦ కృత్యములెల్లన్
యుద్ధంబులోన శస్త్రము
సిద్ధాన్నము విడువరాదు ♦ సీతారామా! ౧౪

క॥ పూరమున నీదులాడుట
సారములౌ శస్త్రతతిని ♦ సాముసలుపుటల్
బీరమున నధికుఁదొడరుట
శ్రీరమణా! మృత్యువాదవు ♦ సీతారామా! ౧౫

కం॥ దూరము నరయనివాఁడును
శూరత్వములేని యట్టి ◆ శూరుం డనిలోఁ
గ్రూరుండు దాతడగ్గరఁ
జేరినఁగార్యంబు చెడదె ◆ సీతారామా! ౧౬

కం॥ పరసతినిఁ గవయువాఁడును
తిరముగఁదాఁ గల్లుఁద్రావి ◆ తిరిగెడివాఁడుఁ
ధరలోన జూదగాఁ డును
జిరకాలము బ్రతుకఁబోరు ◆ సీతారామా! ౧౭

కం॥ పురుషునకు విద్యయున్నను
పరసతికిని భర్త మంచి◆వాఁడై యున్నన్
మురహరుని సేవయున్నను
సిరియేలర పుడమిలోన ◆ సీతారామా! ౧౮

కం॥ విత్తముపోయిన వానికి
మత్తుండగురిపుఁడుగల్గు ◆ మనుజున కిలలోఁ
గ్రొత్తగు సతిపై హత్తిన
చిత్తునకును నిద్రగలదె ◆ సీతారామా! ౧౯

కం॥ ప్రణమన్నఁ బ్రీతి యోగికు
రణమన్నను బ్రీతి యిలను ◆ రాజులకెల్లన్
గుణమన్నఁ బ్రీతి విదులకుఁ
జెనటులకునుఁ దగవు ప్రీతి ◆ సీతారామా ౨౦

క॥ వ్యవహార మాడు వేళల
నవనిన్భుజియించు వేళ ♦ నభినయ వేళన్
బవరమున రిపుల యెదుటను
శివ! శివ! సిగ్గున్నఁజెడరె ♦ సీతారామా ౧౦

క॥ తన నోరు మంచిదైనను
దన యూరును మంచిదగును ♦ ధరలో నెప్పుడున్
గుణమున్న వానిఁజూచినఁ
జెనటియు నటఁదొలఁగకున్నె ♦ సీతారామా! ౧౧

క॥ పరవాసముండు టొకటియు
ధరలోఁగడు ఋణముతోడఁ ♦ దనరుట యొండేన్
దరిలేని మార్గయానము
సిరిలేమియుఁ గష్టదములు ♦ సీతారామా! ౧౩

క॥ ఒరులకు నపకృతిసేయం
దొరకొను చున్నట్టివాఁడు ♦ తూలును భువిలో
హరునకు నపకృతసేసియు
సిరికొమరుఁడు చావ వినమె ♦ సీతారామా! ౧౪

క॥ పొలఁతుకలఁ జూచునప్పుడు
నిలలోన హిరణ్యపుంజ ♦ మొనసిన యప్పుడున్
నలువకును దెగలుపుట్టదె
శిలనాతిగఁ జేసినట్టి ♦ సీతారామా! ౧౫

క॥ సత్యముఁదొలఁగక మనుజుఁడు
నిత్యముఁదన ధర్మమెల్ల ♦ నెరవేర్చుచుఁ దా
సత్యలఘునిష్ఠచే నై
శిత్యముఁగలవాఁడుగాఁడె ♦ సీతారామా!. ౨౬

క॥ దబ్బరలాడెడు మనుజుఁడు
సిబ్బితిక తెలనుగూడి ♦ చెఁగెడివాఁడున్
గొబ్బున పరధనతస్కృతి
సబ్బురఁదాఁజెందుఁ గాదె ♦ సీతారామా! ౨౭

క॥ వెన్నెల చందురుఁజేరును
సన్నుతముగ నదులుజేరు ♦ సాగరమునకున్
పన్నగ సాధ్వియు భర్తను
జెన్నుగఁదాఁజేరుఁగాదె ♦ సీతారామా! ౨౮

క॥ ధనమున్న చదువుగల్గదు
గొనకొనియూ చదువుగలుగఁ ♦ గూడదు ధనమున్
ధనము చదువు గల్గిన వా
సిని గని పెనుపొందుఁగాదె ♦ సీతారామా ! ౨౯

క॥ విద్యలు గలిగిన వాదము
హృద్యంబౌ రూపమున్న ♦ నిలలో జరయున్
ఉద్యద్దేహముఁగల్గిన
ఛేద్యంబును గల్గుఁగాదె ♦ సీతారామా 30

కం॥ సాధువు రేగిన యేనియు
ఆధియుఁ దనమనమునందు ♦ నంటినయేనిన్
భూధవులు తగవులాడిన
శ్రీధవ భువి చేటుగాదె ♦ సీతారామా! 3౧

కం॥ క్షమయున్నఁ గవచమేలను
క్రిమియున్నను రాజులేల ♦ కావలయుభువిన్
సుమహిత కవితయుఁ గల్గ వి
స్మృమరంబగు రాజ్యమేల ♦ సీతారామా! 3౨

కం॥ చెడుగనెడి పేరువచ్చుట
గడియన్ దాఁ గలుగుఁగాని ♦ కష్టము లెన్నేఁ
బడినను యోగ్యత గల్గునె
చెడుతలఁపుల నడఁచిపోవు ♦ సీతారామా! 33

కం॥ పాలును శర్కర యుదకము
మేలిమియగు కప్పురంబు ♦ మించి మెదిపినన్
దూలునె యుల్లికి నైజము
చేలములో నింగువయటు ♦ సీతారామా! 3౪

కం॥ బాలుఁడు చెప్పినయేనియు
నాలింపఁగ వలయుఁ గాని ♦ యురుగుట మేలా?
బాలుని వాక్యమ్ములు పరి
శీలింపక చెడఁడె * తండ్రి ♦ సీతారామా! 3౫

* హిరణ్యకశిపుడు

కం॥ మాటలచేత నెమన్నన
మాటలుఁగా నేరకున్న ♦ మానంబుచెడున్
మాటలు నేర్చినవానికిఁ
జేటెన్నఁడు లేదుగాదె ♦ సీతారామా! ౩౬

కం॥ పిల్లగు ధన మున్నప్పుడె
జెల్లును ధర్మమ్ము తుదిని ♦ చేయఁగనగునే
ఇల్లదికాలుచు నుండఁగఁ
జెల్లునె తా నూతిఁద్రివ్వ ♦ సీతారామా! ౩౭

కం॥ క్షణమును వదలక మనుజుఁడుఁ
గొనకొని తావిద్యలెల్లఁ ♦ గూర్పఁగవలయున్
కణమని విడువక చేకూ
ర్చిన ధన మదివ్యర్థ మగునె ♦ సీతారామా! ౩౮

కం॥ ఒప్పుగ మనుజుండిలలోఁ
జెప్పును దనగౌరవంబు ♦ చెలఁగుచు నెపుడున్
జొప్పడ తనయవమానము
చెప్పునె పరశివుఁడునైన ♦ సీతారామా! ౩౯

కం॥ ఒరుదప్పు వెదకు నేరుపు
పరగన్ దనతప్పువెదకఁ ♦ బాల్పడె నేనిన్
ధరఁజెడునె మొట్టివాఁడును
జిరకీర్తిని బొందుఁగాని ♦ సీతారామా! ౪౦

కం॥ అచ్చపుటల్లునకై నను
ముచ్చటగా మూడునాళ్లై ◆ మురిపెంబొఁగా
కిచ్చలు దీరఁగనుండినఁ
జెచ్చెర నిఁకవెళ్లమనరె ◆ సీతారామా! ౪౧

కం॥ పెల్లైన ధనముఁగల్గిన
నిల్లాలును లేనియిల్లు ◆ వృథయగుఁగాదే
మల్లునకు బలముఁగలిగినఁ
జెల్లునె ధైర్యంబులేక ◆ సీతారామా! ౪౨

కం॥ కన్నెల నమ్మెడివానిని
పన్నగ నన్నృతంపుఁ బల్కుఁ ◆ బల్కెడివానిఁ
చెన్నటి వేశ్యాలోలునిఁ
జెన్నుగ నిల నమ్మరాదు ◆ సీతారామా! ౪౩

కం॥ శ్రీవిభుఁదలఁ పనివానిని
భూవిభుఁదా సేవ జేసి ◆ పొలిచెడివానిఁ
ఏవిద్య లేనివానిని
జీవించిన శవమటండ్రు ◆ సీతారామా! ౪౪

కం॥ నేమమున నున్నవాఁడును
బాములఁబడి కృషినిసల్పి ◆ బ్రతికెడి వాఁడున్
భూమీశునాశ్రితుండును
నేమంబున సౌఖ్యపడరె ◆ సీతారామా! ౪౫

కం॥ నీతిని దెలియనివాఁడు వి
భూతినిఁ దాఁజెందఁబోఁడు ♦ భువిలో నెపుడున్
నాతిని గలుగని వానికిఁ
జేతురె యెవరైనఁబూజ ♦ సీతారామా! ౪౬

కం॥ పుత్త్రులు కలుగనివానిని
మిత్త్రులతోఁగూడని మిడి ♦ మేలపువానిన్
శత్త్రువులుగల్గు వానినిఁ
్రమె దుర్గతికులన్న ♦ సీతారామా! ౪౭

కం॥ తెలిసినవానికినైనను
దెలియని కడుమూర్ఖుకైనఁ ♦ దెలుపఁగవచ్చున్
దెలిసియుఁ దెలియనివానికిఁ
జెలఁగఁగ మఱితెల్పఁదరమె ♦ సీతారామా! ౪౮

కం॥ దాసీపుత్త్రుఁడుగానీ
కాసులు గలవాఁడె రాజు♦గా నెంచఁబడున్
కాసును వీసముకలుగక
చేసునె మరిచిల్లిగవ్వ ♦ సీతారామా! ౪౯

కం॥ ధనమున్నను బలమున్నను
గొనమున్ననుగాని యెపుడు ♦ కూడదు గర్వం
బనువుగఁ గల్గినయేనియుఁ
జెనకఁడె విధి వానినపుడె ♦ సీతారామా! ౫౦

క॥ పెద్దల సేవలచే నిలఁ
దద్దయు సంపత్సమృద్ధి ♦ ధర్మపుసరణుల్
నిద్దపుబోధయుఁ గలుగును
సిద్ధము సౌఖ్యప్రదంబు ♦ సీతారామా ! ౫౧

క॥ పరులకు సంపద గలిగిన
పరువుగఁ దా విద్యతోడ ♦ బ్రతికిన యేనిన్
దిరమగు తేజముగల్గినఁ
జెరుపం దలకొనఁగఁ జెడును ♦ సీతారామా ! ౫౨

క॥ ధనమున్న విదుఁడటంచును
ధనమున్నను దాతయనియు ♦ ధరపల్కుదు రా
ధనమూలము జగమంతయుఁ
జెనటియు ధనముంచ మేటి ♦ సీతారామా ! ౫౩

క॥ పలికిన నోరులకు నెప్పుడు
పలుకంగావలయు హితము ♦ బల్కులుగాకన్
బలుకమియు మేలుగల్గును
శిల నాతిగఁ జేసినట్టి ♦ సీతారామా ! ౫౪

క॥ ధనమును గులమును విద్యయు
నొనరంగా సజ్జనాళి ♦ కొనరుచు యశమున్
ధనమున్ విద్యయు వంశముఁ
జెనటుల కిలనొసఁగుఁగీడు ♦ సీతారామా ! ౫౫

కం॥ ఎవ్వరి కెయ్యది యీశుఁడు
మువ్వరుసల నుదుటవ్రాసి ♦ పాలయుండనియోన్
అవ్వరుసఁదప్పఁజేయుట
చివ్వన శ్రీహరికిఁ దరమె ♦ సీతారామా॥ ౫౬

కం॥ పౌరుషము దైవయోగము
ధారుణిలో నొక్కటైనఁ ♦ దనరును ఫలముల్
కారము లవణము వేరుగఁ
జేరిన రుచిగలుగఁగలదె ♦ సీతారామా॥ ౫౭

కం॥ సిరి యాయువు సుస్థిరమని
మురియుచుఁ దా మనెడువాఁడు ♦ భువిలోఁబాలయున్
సిరి యాయు వస్థిరంబని
చిరధర్మము సలుపవలయు ♦ సీతారామా॥ ౫౮

కం॥ దండింపఁదగినవానిని
దండింపకయున్న రాజ ♦ ధర్మముగా దా
ఖండలునినైనఁగానీ
చెండింపందగును భువిని ♦ సీతారామా॥ ౫౯

కం॥ క్షమయే దాల్చియునుండుట
నమరగఁగడుఁదీక్ష్ణభావ ♦ మడరియెయుండన్
సమకూరఁజనదు పతికి వి
నృమరంబగురాజ్యమున్న ♦ సీతారామా॥ ౬౦

కం॥ ఒడమెగలవెడగునైనను
బుడమిని జనులెల్లయపుడు ♦ పొగడుదు రెలమిన్
ఒడమెను దా నెడఁబాసినఁ
జెడుగని నిందింతు రుఱక ♦ సీతారామా॥ ౬౧

కం॥ అనలము కొంచెమెయైనను
అనిలము దా సోకినపుడె ♦ యధికంబౌఁగాఁ
దనుచేయుపనికి దైవము
చెనకక తోడ్పడిన మేలు ♦ సీతారామా॥ ౬౨

కం॥ పరధనము లపహరించుట
మఱిపనిగాఁబూనితఱిని ♦ మఱగుటయెల్లన్
తిరమైనయ ప్రతిష్ఠకుఁ
జెరచెరఁగీడునకు నెలవు ♦ సీతారామా॥ ౬౩

కం॥ అనుపమనియతినిగూడియు
నెనలేనిధనంబులొసఁగి ♦ యేర్పడఁగ్రతువుల్
మొనసి శతమ్ములుగాఁజే
సినఁదుల యేశాంతునకును ♦ సీతారామా॥ ౬౪

కం॥ చెల్లుబడికలిగియుండియుఁ
దల్లికిఁదండ్రికిని నెపుడు ♦ ధన దేహంబుల్
చెల్లించిసేవఁజేయఁడో?
చిల్లరవాఁ డనరె వాని ♦ సీతారామా॥ ౬౫

క॥ కలిమిగలనరుఁడు సతతముఁ
బలులోభముచేత నర్థి ♦ వారికి నీకన్
ఇలలోనఁ దాపఁజూచినఁ
జెలఁగుచు నా సిరితొలంగు ♦ సీతారామా! ౬౬

క॥ ఇతరులు చూచుచునుండఁగఁ
బతితుఁడునై తానొకండె ♦ భక్షించుటయున్
మతిచెడి బంతిని వేరుగ
క్షితిలో భుజియింప విసము ♦ సీతారామా! ౬౭

క॥ మితిమీఱిన సంపత్తున
కతిభోగమె రక్షయగుచు ♦ నపురున్నాదే
వితతముగఁ జెరువునిండిన
క్షితిరక్షణములుగుఁగాదె ♦ సీతారామా! ౬౮

క॥ పరిణయమూడెడు వేళల
నరయఁగ గురుకార్యమప్పు ♦ డతివలపట్లన్
బరుపాణి రక్షణంబునఁ
జెరుపదు నన్నృతంబునపుడు ♦ సీతారామా! ౬౯

క॥ నడివయసు గలిగియుండియుఁ
బడతుక పతిభక్తితోడఁ ♦ బరిగినయెడలన్
బడియుండ జనకునింటను
జెడుగనరే జనులు దాని ♦ సీతారామా! ౭౦

కం॥ ఏనరుఁడు సంపదధికముఁ
దానొరయుచు ననుభవింపఁ ♦ దలఁపండేనిన్
ఆనరుసంపద యంతయుఁ
జేనికి నిడుబొమ్మపోల్కి ♦ సీతారామా! ౨౧

కం॥ గరళంబునొసఁగువానిని
పరగృహముల్ తగులఁబెట్టు ♦ పాపాత్మకులన్
పరసతిని గవయువానిని
చెరఁబట్టి వధింప శుభము ♦ సీతారామా! ౨౨

కం॥ ధరలోన నరయువానికి
దొరయునుఁ దా శుభసమృద్ధి ♦ తొందరపడి తా
కరియనుచు శరము నేసియుఁ
జెరుపొందఁడె దశరథుండు ♦ సీతారామా! ౨౩

కం॥ కవితంగలిగినరసమును
గవికన్నను భావవిదుఁడె ♦ గాంచునుబుడమిన్
నవకోమలి రతి జనకుఁడు
శివ! శివ! తెలియంగలఁడె ♦ సీతారామా! ౨౪

కం॥ తనుజేయు కర్మమెల్లను
జననాంతమ్ములకు దుఃఖ ♦ సౌఖ్యంబులకున్
బెనుకారణ మగు నేఁ జే
సిన దోషము లడఁచిబ్రోవు ♦ సీతారామా! ౨౫

క॥ అతిలోభివాని ధనమును
పతిదైవముగాఁగఁ గొల్చు ♦ భామా స్తనముల్
తతభీ వ్యాఘ్రనఖంబులు
క్షితిఁజచ్చిన ముట్టనగును ♦ సీతారామా! ౨౬

క॥ నష్టముఁ గలిగిన యేనియుఁ
గష్టములెన్నెనియైనఁ ♦ గలిగిన యేనిన్
నిష్ఠను శ్రీహరిఁ దలఁచిన
శిష్టునకును ముక్తి లేదె ♦ సీతారామా! ౨౭

క॥ శ్రుతమున శ్రోత్రియముంగను
నతులంబౌతపముచే మ ♦ హాత్త్వముగలుగున్
ధృతిచే సహాయ మమరును
శ్రితకరుణాభరణ! రామ! ♦ సీతారామా! ౨౮

క॥ కలిమియు లేమియు ననునవి
కలకాలము లుండఁబోవు ♦ కలుషాత్ముల నా
కలిమియు లేమియుఁ గలఁచును
జెలఁగుచు సుఖదుఃఖగతిని ♦ సీతారామా! ౨౯

క॥ అంగవిహీను దరిద్రుని
పొంగుచు విద్యావిహీను ♦ భూమిగురూపిన్
సాంగశ్రుతి నధ్యాపకు
శృంగీశుని నిందతగదు ♦ సీతారామా! ౩౦

క॥ జ్ఞాతియుఁ గోరును నిధనము
ఖ్యాతిని సుజనుండుగోరుఁ • గాముకు డెప్పుడున్
నాతినిఁగోరును భక్తుఁడు
సీతాపతి నిన్నుఁగోరు • సీతారామా! ౬౧

క॥ ఏగతిపాటులు బడినను
పోఁగలదే కాకి పికపుఁ • బోలిక లెప్పుడున్
భోగము లబ్బినఁ జెందునె
శ్రీ గలవానికినె గాక • సీతారామా! ౬౨

క॥ ఒక్కొకసమయమునందున
గ్రక్కున నల్పునకుఁజిక్కుఁ • గడుబలవంతుం
డక్కపికేతనుచేతం
జిక్కఁడె శ్రీశివుఁడు ననిలో • సీతారామా! ౬౩

క॥ మానిని చెప్పినయట్టులఁ
బూనికతోఁజేయునరుఁడు • పొందువిపత్తుల్
హానినిఁ బొందఁడె లేడిని
శ్రీనాథుఁడుఁ బట్టఁబోవ • సీతారామా! ౬౪

క॥ సిరిలేనివాని కీభువి
నరయఁగ దానంబుఁజేయ • నదిసఫలంబౌ
వఱపునఁగురిసిన వర్షము
చెఱచునె సస్యాళినెపుడు • సీతారామా! ౬౫

క॥ ఉరుకరుణాన్విత దాతకు
సిరిచెడినను యాచకాళి ♦ చేరుదు రెలమిన్
ధరఁ బిప్పియైనఁ జీమలు
చెఱకునుఁ దాఁ జేరుఁగాదె ♦ సీతారామా! ౯౬

క॥ అందఱి కిష్టుండౌనెడఁ
బొందునె యాపుణ్యశాలి ♦ పుడమిని బాధల్
అందొక వేళను గల్గినఁ
జెందునె స్థిరపదవి నవియు ♦ సీతారామా! ౯౭

క॥ ఎచ్చట రసికతయుండునో
నచ్చట జనులెల్లఁ బ్రేమ ♦ హత్తుదురుగదా
అచ్చపు గోకిల కూయఁగఁ
జెచ్చెరఁ బ్రేమింతురెగాదె ♦ సీతారామా! ౯౮

క॥ కాంతుఁడుచిత్రజ్ఞుడైనను
గాంతయు కడు గడుసురాలు♦గా నుండుధరన్
కాంతయు సాధ్వియనఁ జెడు
చింతలదొరయు పతియాను ♦ సీతారామా! ౯౯

క॥ బత్తిని నీకునుఁ బత్తిరి
గుత్తముగా నొసఁగికొలువుఁ ♦ గొల్చెడివారిన్
ముత్తుల బుత్తుల నొసఁగుచుఁ
జిత్తమునకు హర్ష మీవె ♦ సీతారామా! ౧౦౦

ఉ॥ ఎందఱో పండితోత్తము లి♦కెందరొ సత్కవిశేఖరు ల్సుఖ
స్యందములైన కావ్యములు ♦ సల్పిరమంద కవిత్వసంపదా
నందముగా భవద్వినుతి ♦ నష్టకము ల్శతకాదులంచు నే
నందులబత్తి నీశతక ♦ మప్పనఁజేతుఁ బరిగ్రహింపుమా!

## గద్య

ఇతి శ్రీహయాననపాదారవిందమరందసేవనామందానంద
నందోహసంవర్ధి, కౌండిన్యసగోత్రపవిత్ర, లంకావంశ
పయఃపంథోధిరాకానిశాకర, శ్రీశివరామశాస్త్రి ప్రథమ
తనూజ, వేదాంతశిరోమణ్యుభయభాషేత్యాది
బిరుదాంకి సీతారామశాస్త్రి ప్రణీతంబగు
నీతి సీతారామశతకము
సమాప్తము.

తత్సత్

ఓం



# ప్రకటన

ఆంధ్రస్తోత్రమణిత్రయి ... ... 0-2-0

ఆంధ్రబాలరామాయణము ... ... 0-4-0

అచ్చ తెలుఁగు ఋతుసంహారము ...

## రాఁబోవు గ్రంథములు

అచ్చ తెలుఁగు రసమంజరి

ఆంధ్రసవత్సజాతీయము

వలయువారు :

చింతపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రి,
Door No. 23/276
గవర్నరుపేట, బెజవాడ.